భారతీయ సంస్కృతీ

విజ్ఞాన వాఙ్మయ ప్రచారము

# ప్రియవ్రతుని వంశము - 8


రచన - కూర్పు - సకరణ

గ్రంధకర్త - కొర్రపాటి వెంకటసుబ్బారావు

రిటైర్డు టీచరు

128 C, కాప్రాచెరువు, సైనిక్‌పురి పోస్టు

వయా సికింద్రాబాదు. (ఆం. ప్ర.)

భారతీయ సంస్కృతీ
విజ్ఞాన వాఙ్మయ ప్రచారము

# ప్రియవ్రతుని వంశము - 8

రచన - కూర్పు - సేకరణ
గ్రంథకర్త - కొర్రపాటి వెంకటసుబ్బారావు
రిటైర్డు టీచరు
128 C, కాప్రాచెర్వు, సైనిక్‌పురి పోస్టు
వయా సికింద్రాబాదు. (ఆం.ప్ర.)

వేయి ప్రతులు 1990 రూ. 4-00



గ్రంథకర్త : కె. వి. సుబ్బారావు రాజ్యలక్ష్మి దంపతులు

# స్వాయంభువమనువు కుమారులు, ప్రియవ్రతుని వంశము మరియు ఉత్తానపాదుని కుమారుడు ధృవుని వంశము.

## ప్రియవ్రతుని వంశము

స్వాయంభువ మనువును, శతరూపను బ్రహ్మదేవుడు సృష్టించి నాడు వారిద్దరు భార్యాభర్తలు అయినారు. వారిద్దరే ప్రధమ మహారాజు మహారాణి అయి ప్రశిద్ధి చెందినారు. ఆయన సుఖముగా రాజ్యపాలన చేయుచున్నాడు. అతడు చాలాకాలము తపముచేసినాడు. వారు పరాశక్తి ప్రియతమ భక్తులు. వారికి ప్రియవతుడు, ఉత్తానపాదుడను యిరువురు కుమారులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతియను ముగ్గురు పుత్రికలు పుట్టిరి. ఆకూతిని రుచి ప్రజాపతికి, దేవహూతిని కర్దమప్రజాపతికి, ప్రసూతిని దక్షప్రజాపతికి యిచ్చి వివాహము చేసిరి.

స్వాయంభువమనువు పెద్ద కుమారుడు ప్రియవ్రతుడు పరమ భాగవతుడు. అతడు ఎల్లప్పుడు పరబ్రహ్మమునే చింతించుచూ వుండెను. అతడు నారదుని కృపవలన పరమార్ధ తత్త్వమును తెలుసు

కొనెను. ఆతని భక్తి తత్పరతలను, పారమార్థిక చింతనలను తిల కించిన స్వాయంభువమనువు చాలా వృప్పొంగిపోయెను.

స్వాయంభువమనువు సమర్థవంతుడైన రాజు. అతడు తన రాజ్యమును తన పెద్ద కుమారుడగు ప్రియవ్రతునకు అప్పగించ దల చెను. కాని ప్రియవ్రతునకు సమ్మతిగా లేదు. సంసారవ్యామోహములో పడిపోయి రాజ్యభారమును మోయుచు, పరమాత్మని మరచిపోవుదునే మోయని ఆతని భయము. ఆలుబిడ్డలు, సంసారతాపత్రయము, తన అధఃపతనమునకు కారణమగునని ఆతని ఉద్దేశ్యము. అందువలన అతడు రాజ్యభారమును మోయుటకు అంగీకరించలేదు. అతడు తన మనస్సును సదా పరమాత్మునియందే లగ్నము చేయుచుండెను. అతడు గంధమాదన పర్వతములకు తపము సేయుటకు వెడలిపోయెను.

బ్రహ్మదేవునికి ప్రజాభివృద్ధి కావలెనని వుద్దేశము. స్వాయం భువమనువు నారదుని వెంట గంధమాదన పర్వతమునకు తన కుమా రుడు తపము చేయుచున్న చోటునకు పోయెను. వారిద్దరు ప్రియవ్రతు నికి అనేక బోధలు చేసిరి నారదుడు స్వయముగా ప్రియవ్రతునకు ఆత్మబోధచేసి, సంసారము స్వీకరించి రాజ్యపాలన చేయవలసినదిగా ప్రబోధము చేసెను. కాని ప్రియవ్రతుడు ఆమోదించలేదు. సమయము కనిపెట్టి స్వయముగా బ్రహ్మదేవుడు ప్రియవ్రతునికి ప్రత్యక్షమయ్యెను.

ప్రియవ్రతుడు బ్రహ్మదేవునికి సాష్టాంగ నమస్కారముచేసి ప్రార్థించెను. బ్రహ్మదేవుడు ప్రియవ్రతునకు ఉపదేశముచేసి రాజ్యపాలన చేయుటకు ఆతనిని సమ్మతి పరచెను. రాజ్యపాలనకు సమ్మతించినందులకు తండ్రి స్వాయంభువమనువు చాలా సంతోషించెను.

స్వాయంభువమనువు రాజ్యభారమును తన పెద్ద కుమారుడగు ప్రియవ్రతునకు అప్పగించెను. తదుపరి అతడు గృహస్థాశ్రమమును వదిలిపెట్టి పారమార్థిక పరుడై పరమాత్ముని సేవలో లీనమై పోయెను.

మహారాజైన ప్రియవ్రతుడు తన మనస్సును శ్రీహరిపాదారవిందములపై లగ్నమొనర్చుచూ రాజ్యపాలన సాగించుచుండెను. ప్రియవ్రతుడు విశ్వకర్మ పుత్రికయగు బార్హిష్మతిని వివాహమాడెను. ఆమెకు పదిమంది పుత్రులు పుట్టిరి. ఆగ్నీధ్రుడు, ఇధ్మజింహుడు, యజ్ఞబాహుడు, మహావీరుడు, హిరణ్యరేతుడు, ధృతపృష్ఠుడు, సవనుడు, మేధాతిథి, వీతిహోత్రుడు, కవి అను పదిమంది పుత్రులు ప్రియవ్రతుని కుమారులు. ఊర్జస్వతి అను పుత్రికగూడా వారికి వుండెను. ప్రియవ్రతునకు రెండవభార్య కర్దమ ప్రజాపతి పుత్రిక. ఆమెకు ఉత్తముడు, తామసుడు, రైవతుడు అను ముగ్గురు పుత్రులు పుట్టిరి. వారు మహానుభావులై, పరాంబికా భక్తులై మన్వంతరములకు అధిపతులైరి. పెద్దభార్య కుమారులలో కవి, సవనుడు, మహావీరుడు అనువారు బ్రహ్మచారులై పోయిరి. వారు పూర్వజన్మ వృత్తాంతములను తెలిసుకొనగలిగిరి. వారు చివరకు పరమాత్మునితో లీనమైపోయిరి. ప్రియవ్ర

తుడు మిగిలిన ఏడుగురు పుత్రులతో సుఖముగా రాజ్యభారము నిర్వ హించుచుండెను. ప్రియవ్రతుడు పదకొండు అర్బుదముల కాలము రాజ్యమును పాలించెను. అతనికి తన మొదటిభార్యయగు బర్హిష్మతి మీద ప్రేమ మెండు. అతడు లోకమునే మరచి అంతఃపురములో ఆమెతో భోగములను బాగుగా అనుభవించెను. కాని రాజ్యపాలనలో ఏలోటు రానీయక రాజ్యమును చక్కగా పరిపాలించెను.

సూర్యభగవానుడు మేరు పర్వతమును చుట్టి వస్తూవుండుటచే మనకు రాత్రింబగళ్లు కలుగుచున్నవి. ప్రియవ్రతుడు తన పాలనలో రాత్రింబగళ్లు కలుగకుండా ఎల్లప్పుడు పగలుగానే తన రాజ్యములో వుండవలెనని నిర్ణయించెను. అందువలన సూర్యభగవానుని రథము మేరు పర్వతము చుట్టూ తిరుగుచున్నప్పుడు వెనుక భాగమున చీకటి కాకుండా వుండవలెను. అందుకుగాను సూర్యభగవానుని రథము వెనుక సూర్య భగవానుని రథమువంటి రథమును తయారు చేయించి దానిపై తాను ఎక్కి రెండవ సూర్యునివంటి తేజముతో ప్రకాశించుచూ తాను గూడా మేరుపర్వతమునకు ప్రదక్షిణము చేయసాగెను. అతని జ్యోతిర్మయమైన రథమువలననూ, అతని తేజమువలననూ, చీకటియే లేకుండా వుండెను. సూర్యుడు అస్తగిరికి చేరునప్పటికి తాను ఉదయ గిరికి తన రథముమీద చేరువాడు. అందువలన భూమికి చీకటియే లేకుండా పోయినది.

ఈ విధముగా ఏడుసార్లు పర్వతముచుట్టూ తిరిగినాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ప్రియవ్రతునకు ప్రత్యక్షమై అతనితో "రాత్రిని పగలు చేయుటకు నీకు అధికారము లేదు." అని అతనిని నివారించెను. ప్రియవ్రతుడు ఏడుసార్లు తన రథముతో మేరువును ప్రదక్షిణము చేసెను. అందువలన ఏడు గోతులు ఏర్పడినవి, ఆ ఏడు గోతులే సముద్రములు అయినవి. మధ్యలోవున్న భాగములు అల్లే ఏడు ద్వీపములుగా అయినవి. అందువలన ఆ ఏడు ద్వీపముల చుట్టును నాలుగువైపులా సముద్రములు ఏర్పడినవి. జంబూద్వీపము, ప్లక్షద్వీపము, శాల్మలీద్వీపము, కుశద్వీపము, క్రౌంచద్వీపము, శాకద్వీపము, పుష్కరద్వీపము, అను ఏడు ద్వీపములుగా అయినవి. అల్లే ఆరధ చక్రములతో ఏర్పడిన గోతులు సముద్రములైనవి. ఉప్పు సముద్రము, చెరుకు సముద్రము, కల్లు సముద్రము, నేతి సముద్రము, పాల సముద్రము, పెరుగు సముద్రము అని ఏడు సముద్రములు.

ప్రియవ్రతుడు తన ఏడుగురు కుమారులను ఏడు ద్వీపములకు రాజులుగా చేసెను. జంబూద్వీపమునకు అగ్నీధ్రుని రాజుగా చేసెను. ప్లక్షద్వీపమునకు ఇధ్మజిహ్వుని, శాల్మలీద్వీపమునకు యజ్ఞబాహుని, కుశద్వీపమునకు హిరణ్యరేతుని, క్రౌంచద్వీపమునకు ఘృతపృష్ఠుని, శాకద్వీపమునకు వీతిహోత్రుని, పుష్కరద్వీపమునకు మేధాతిథిని రాజులుగా చేసెను.

ప్రియవ్రతుడు తన పుత్రికయగు ఊర్జస్వతిని శుక్రాచార్యుల వారికిచ్చి వివాహము చేసెను. శుక్రాచార్యులు భృగుమహర్షి కుమారుడు.

పూర్జ్వస్వతి కుమార్తెయే దేవయాని. శుక్రాచార్యుల వారికి తన కుమార్తెయగు దేవయానిమీద చాల ప్రేమ.

ప్రియవ్రతుడు నారదులవారిచే ప్రబోధమును పొంది ఆఖరికి ధన్యుడైనాడు. ఈ విధముగా భూమండలమును ద్వీపములుగా విభజించి, ప్రతి ద్వీపమునందును వేరువేరు నదులను, పర్వతములను, అడవులు మొదలగు వాటిని ఎల్లలుగా నిర్ణయించి ప్రియవ్రతుడు శాశ్వత కీర్తిని పొందెను.

స్వాయంభువమనువు కుమారుడు ప్రియవ్రతుడు. అతడు తన కుమారులకు తన రాజ్యములోనున్న భూమినంతను 7 ద్వీపములుగా ఏర్పాటుచేసి. వారికి ఏడు ద్వీపములను రాజ్యములుగా నిచ్చి పరిపాలింపచేసెను.

| ద్వీపములు - 7 | అధిపతులు |
|---|---|
| జంబూద్వీపము | అగ్నీధ్రుడు |
| ప్లక్షద్వీపము | ఇధ్మజింహుడు |
| శాల్మలీద్వీపము | యజ్ఞబాహుడు |
| కుశద్వీపము | హిరణ్యరేతుడు |
| క్రౌంచద్వీపము | ఘృతప్రృష్టుడు |
| శాకద్వీపము | మేధాతిధి |
| పుష్కరద్వీపము | వీతిహోత్రుడు |

## లోకాలోకములు

| | |
|---|---|
| పుష్కర ద్వీపము | పుష్కరమనగా మెట్టతామర<br>రాజు వీతిహోత్రుడు |
| శాక ద్వీపము | శాకమనగా టేకుచెట్టు<br>రాజు మేధాతిధి |
| క్రౌంచ ద్వీపము | క్రౌంచము అను పేరుగల కొండ వున్నది.<br>రాజు ఘృతప్రుష్టుడు |
| కుశ ద్వీపము | కుశమనగా దర్భ<br>రాజు హిరణ్యరేతుడు |
| శాల్మలి ద్వీపము | శాల్వలీ అనగా బూరుగుచెట్టు<br>రాజు యజ్ఞబాహుడు |
| ప్లక్ష ద్వీపము | ప్లక్షమనగా జువ్విచెట్టు<br>రాజు ఇధ్మజింహుడు |
| జంబూ ద్వీపము | జంబూ అనగా నేరేడుచెట్టు<br>రాజు ఆగ్నీధ్రుడు |

7 ద్వీపముల వివరములు ↑

# 1. జంబూద్వీపము

జంబూద్వీపమునకు అధిపతి అగ్నీధ్రుడు. జంబూద్వీపము లక్షయోజనముల విస్తీర్ణము కలిగి విశాలముగా పద్మమువలె వర్తులాకారముగా వున్నది. దానిలో ఏడు వర్షములు గలవు. ఒక్కొక్క వర్షము విస్తీర్ణము తొమ్మిదివేల యోజనములు. వాటిలో పర్వతపంక్తులు సముద్రముల వరకు వ్యాపించి యుండును.

జంబూద్వీపములో మధ్యలో ఇలావృతవర్షము గలదు. అది చతురస్రాకారముగా వున్నది. వర్షములకు మధ్యగా నాభీస్థానమువలె వున్నది. జంబూద్వీపములో రమ్యక, హిరణ్మయ, కురు, భద్రాశ్వ, ఇలావృత, కేతుమాల, హరి, కింపురుష, భారతవర్షములని తొమ్మిది వర్షములు గలవు.

చతురస్రము ఆకారముగా ఇలావృతవర్షము, పద్మము ఆకారములోవున్న జంబూద్వీపములో వెలయుచున్నది. ఈ ఇలావృత వర్షమునకు ఇరువైపులా, ఉత్తరదక్షిణములలో రెండేసి వర్షములు వున్నవి. వానికి ఉత్తర దక్షిణములుగా రెండేసి వర్షములు ధనురాకారముగా నున్నవి. ఇలావృత వర్షమునకు మధ్యభాగమున బంగారు రూపమున ప్రకాశించు మేరు పర్వతము గలదు. అది గుండ్రముగా నుండి జంబూద్వీపములో భూకమలమునకు దిద్దుగా నున్నది మేరు పర్వత శిఖరముమీద విస్తీర్ణము ముప్పది రెండువేల యోజనములు. దాని యెత్తు భూగర్భమునుండి పదునారువేల యోజనములు. అది భూమిమీద ఎనుబదినాలుగువేల యోజనముల పొడవుగా వ్యాపించి వున్నది.

ఇళావృత వర్షమునకు ఉత్తరముగా నీల, శ్వేత పర్వతములు వున్నవి. అవి చూచుటకు వరుసగా వున్నవి. ఇళావృత వర్షమునకు ఉత్తరమున రమ్యక, హిరణ్మయ కురువర్షములు వున్నవి. దక్షిణ భాగమున నిషధ, హేమకూట, హిమాలయ పర్వతములు వున్నవి. ఇళావృతమునకు పడమరగా మాల్యవంతము అను పర్వతము వున్నది. తూర్పున గంధమాధన పర్వతముగలదు. ఇళావృత వర్షమునకు దక్షిణమున హరివర్షము, కింపుషవర్షము, భారతవర్షములు గలవు. ఇళావృత వర్షమునకు తూర్పున కేతుమాలవర్షము, పడమర భద్రాశ్వవర్షము వున్నది. మధ్యగా మేరువు వున్నది.

## జంబూద్వీపము

9 వర్షములు

| | | |
|---|---|---|
| నీల పర్వతములు | | శ్వేత పర్వతములు |
| రమ్యక | హిరణ్మయ | కురు |
| భద్రాశ్వ | ఇలావృత వర్షము<br>మేరుపర్వతము | కేతుమాల |
| నిషధపర్వతము | హేమకూటము | హిమాలయము |
| హరివర్షము | కింపురుష | భారత దేశము |

మేరుపర్వతము భూమిమీద 84 వేల యోజనముల పొడవు.

మేరుపర్వతము ఎత్తు భూమినుండి 16 వేల యోజనములు.

మేరుపర్వత పాదములందు మందర పర్వతము కుముదము అను పర్వతములు వున్నవి. మేరు మందర ప్రాంతములలో దేవతా స్త్రీలు విహారములు చేయుచుందురు. నందనము, చైత్రరథము, వైభ్రాజము, సర్వభద్రము అను వుద్యాన వనములు అక్కడ వున్నవి. ఆ వనములలో దేవతాస్త్రీలు విహారములు చేయుచుందురు. మేరుపర్వతము మందర పర్వతములనుండి క్రిందపడు పవిత్ర జలములతో అరుణోదయ, అనునది అక్కడ ప్రవహించుచుండును. అందుండి దాని శాఖగా జంబూనది పుట్టినది. అరుణోదయ నదీతీరమున అరుణాదేవి అను దేవత దేవగణముచే అక్కడ పూజింపబడుచున్నది. అరుణోదయ నదీప్రాంతమున నేరేడు వృక్షములు జాస్తిగా వున్నవి. జంబూవృక్షము అనగా నేరేడు వృక్షము. వాటికి గజము ప్రమాణము గల పండ్లు వుండును. అందువలననే ఆ వర్షమునకు జంబూద్వీపము అని పేరు వచ్చినది. అరుణోదయ నదిలోనుండి ప్రారంభమైన జంబూనది ఒడ్డున జంబార్విని అను పేరుగల దేవిని దేవతలు మొదలగువారు పూజించుచుందురు. ఆ దేవిని వారు కోకిలాక్షి, కామకళ, కామపూజిత, కఠోర విగ్రహ, నాగమాన్య, గభస్తిని అను పేర్లతో పిలుచుచూ, సేవించుచుందురు. జాంబూనది ప్రవహించు ప్రాంతములో భూమి అంతయు బంగారు మయము, ఆదిత్యకామినులు అమృత్తికతో బంగారు సొమ్ములు చేయించుకొని సౌభాగ్యవంతులై వుందురు. ఆగిరి శిఖరములనుండి పంచధారలుగా అధోముఖముగా నదులు ప్రవహించుచుండును. మహాదేవి, ధారేశ్వరి అను పేరుతో అచ్చట పూజలందుచున్నది.

## జంబూద్వీపము

జంబూద్వీపము వర్తులాకారముగా వున్నది. జంబూద్వీపములో ఇలావృతవర్షమున మేరు పర్వతము వున్నది.

| | | |
|---|---|---|
| రమ్యకవర్షము | హిరణ్మయవర్షము | కురువర్షము |
| భద్రాశ్వ వర్షము | ఇలావృత వర్షము<br>మేరు పర్వతము<br>పర్వతముమీద విస్తీర్ణము<br>32 వేల యోజనములు<br>మందరగిరి పర్వతము. కుముదము. | కేతుమాల వర్షము |
| నిషధపర్వతము | హేమకూటము | హిమాలయము |
| హరివర్షము | కింపురుషవర్షము | భారతవర్షము |

మేరుపర్వత, మందరపర్వత ప్రాంతములలో వున్న వనములలో దేవతాస్త్రీలు విహరించుచుందురు. అక్కడ చైత్రరథము, వైభ్రాజము, సర్వభద్రము, అనువుద్యానవనములు గలవు. అచ్చట అరుణోదయ నదినుండి జంబూనది పుట్టినది. జంబూనది ప్రవహించు భూమి అంతా బంగారమయము. ఆ మట్టితో వారు బంగారు సొమ్ములు చేయించుకొందురు.

కుముద పర్వతముమీద శతబలము అను వృక్షమువున్నది. అది మర్రి వృక్షము. ఆవట వృక్షచ్ఛాయలో మీనాక్షి దేవాలయము వున్నది. ఆ దేవిని దేవాసురులు పూజించుచుందురు. అచ్చట నదులలో ఎల్లప్పుడు స్వాదుఫలజలములు వుండును. అచ్చట ఆ ఫలములు తిని ఆ జలములు త్రాగినవారికి జరాసంబంధమైన భారలుగాని, శరీర ముడతలుగాని, రోగములుగాని, భ్రమగాని, స్వేదదుర్గంధాదులుగాని, వుండవు. వారు యావజ్జీవము సుఖ సంతోషములతో వుందురు. ఆ వర్షములలో నివశించు జనులు జపధ్యాన సమాధులతో మహాదేవిని అర్చించుచుందురు. ఇలావృతవర్షములో నిరంతరము వృక్షరాజములు ఆ వనములలో వుండును. వృక్షములు వికశించిన పూలతో వాసనలతో విరాజిల్లుచుండును. అందలి వనములలోని జలాశయముల నీరు నిర్మల ముగా వుండును. అచ్చట నల్లకలువలు ఎక్కువగా వుండును. ఆ జలాశయముల తీరములలో దివ్యసుందరులు విహారములు చేయు చుందురు. ఇలావృత వర్షమున, రుద్రుడు భవానీదేవితో నివశించి వుండును. ఆ శివక్షేత్రమున భవాని శాపమువలన పురుషులు ప్రవేశించ రాదు. అక్కడ పురుషులు ఆ శివక్షేత్రమున ప్రవేశించినవారు స్త్రీలు అయిపోదురు. కోట్లకొలది స్త్రీగణములు నిత్యము భవానీ రుద్రులను పూజించుచుందురు. రుద్రుడు సంకర్షణమూర్తిని ధ్యానించుచుండును.

భద్రాశ్వవర్షములో వాసుదేవమూర్తిఅయిన హయగ్రీవుని వారు పూజింతురు. భద్రశ్రవసుండను రాజు ప్రజలతో సహా, హయగ్రీవ

మూర్తిని ఆరాధించుచుండును. హరివర్షములో పూజింపబడు దేవుడు నృసింహమూర్తి. ఆతనిని ప్రహ్లాదుడు ఆరాధించుచుండును. కేతుమాల వర్షమున స్మరణరూపముతో విరాజిల్లు రమాదేవి ఆ హరిని ఎల్లప్పుడు ధ్యానించుచుండును.

రమ్యకవర్షములో మత్స్యమూర్తిని మనువు నిత్యము ధ్యానించుచుండును. హిరణ్మయ వర్షమున కూర్మరూపుడైన విష్ణువును పితృగణాధిపతి అయిన ఆర్యముడు ధ్యానించుచుండును. ఉత్తర కురు భూములలో యజ్ఞవరాహరూపుడగు శ్రీవిష్ణువును, భూదేవి ఎల్లప్పుడు ధ్యానించుచుండును. భారతదేశమున వైకుంఠుడగు హరిని నారదాదులు సేవించుచుందురు. జంబూద్వీపమునకు ఎనిమిది ఉపద్వీపములు గలవు. అందులో సింహళము, లంక అను ద్వీపములుగూడా ఉన్నవి. జంబూద్వీపములో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులు అను చాతుర్వర్ణములు వున్నవి.

## మేరు పర్వతము

మేరుపర్వతము జంబూద్వీపములోని ఇలావృత వర్షములో మధ్యగా వున్నది. మేరుపర్వతము ఎత్తు లక్ష యోజనములు. అది భూమికి ఉపరిభాగమున ఎనుబదినాలుగువేల యోజనముల పొడవున

వ్యాపించి యున్నది. మేరుపర్వతము శిఖరముమీద ముప్పదిరెండువేల యోజనముల విస్తీర్ణము గలదు. దానికి నాలుగు దిక్కులను ఎనిమిది పర్వతములు వున్నవి. మేరుపర్వతమునకు తూర్పున అనగా మేరుపర్వతమూలము నుండి సహస్రయోజనములు దూరము వదలిపెట్టి, తూర్పున జఠరగిరి, దేవకూటము అను గిరులు కలవు. దక్షిణమున కైలాసము, కరవీరము, అను పర్వతములు గలవు. మేరు పర్వతమున పడమర పవమాన, పారియాత్ర, అను పర్వతములు గలవు. ఉత్తరమున త్రిశృంగము, మకరము, అను పర్వతములు గలవు మేరుపర్వత శృంగమున బ్రహ్మకు స్థానముగా బ్రహ్మపురి వున్నది. దానిచుట్టూవున్న గిరులు అష్టదిక్పాలకులకు ఆటపట్టుగా వున్నవి. ఆ మేరువునందే విష్ణువుకు వామపాద అంగుష్టమునుండి గంగ నిరమించుచున్నది. అది గంగ వుత్పత్తిస్థానము. విష్ణు పాదమునుండి బయలుదేరిన గంగ బ్రహ్మ సదనంబగు పద్మమునంబడును. బ్రహ్మలోకములో యేకవేణియగు గంగ నాలుగు చీలికలైనది. విష్ణు పదమునుండి ధృవపదమునకు వచ్చి అక్కడనున్న సప్తర్షి మండలమునకు ప్రదక్షిణముగా ప్రవహించి, చంద్రమండలము దరశికొని, బ్రహ్మలోకమునుండి క్రింద పడుచున్నప్పుడు నాలుగు పాయలై, సీత, అలకనంద, చతుర, భద్ర అను పేరులతో పిలువబడినవి.

సీత యనుపాయ, బ్రహ్మ సదనమైన పద్మమునుండి గంధ మాదన శిఖరమునపడి, తూర్పుగా ప్రవహించి, భద్రాశ్వవర్షమునకు చేరినది. అనంతరము సీత అనుపాయ సముద్రములో కలసిపోయినది.

మరియొకపాయ చతుర అను పేరుతో మాల్యవంతమను గిరి శృంగమునపడి అత్యంత వేగముగా కేతుమాల వర్షమున ప్రవేశించి చక్షువు అను మారుపేరుతో పడమటదిశగా ప్రవహించి సముద్రములో పడినది.

అలకనంద అను పాయ దక్షిణముగా పారి హేమకూట పర్వతముగుండా భారతవర్షమునకు వచ్చి క్రమముగా దక్షిణ సముద్రమున కలిసినది.

భద్ర అను పేరుగల పాయ ఉత్తర కురు భూములను ప్రవేశించి సముద్రములో పడినది. ప్రతి వర్షములోను చాలా నదులు ప్రవహించి ఆయా వర్షములలో పంటలు పండించుచున్నవి.

మేరుపర్వతము, మందరపర్వతములలో నుండి అనేక నదులు ప్రారంభమై, పవిత్రోదకములతో ప్రవహించుచూ కర్మక్షేత్రమైన భారతవర్షములో ప్రవహించి, అతిపవిత్రవంతము చేయుచున్నవి.

# మేరుపర్వత పైభాగము

## విస్తీర్ణము 32 వేల యోజనములు

### అష్టదిక్పాలక పురములు

○ ○ ○

○ బ్రహ్మపురి

విష్ణుపాదము

○ | గంగ వుత్పత్తి స్థానము |

○

ధృవపదము

సప్తర్షిమండలము

○ ○ ○

చంద్రమండలము

గంగ, ఉత్పత్తిస్థలమున బ..ులుదేరి, ధృవపదమునకు చేరి, సప్తర్షి మండలముచుట్టి, చంద్రమండలము చేరి, అచ్చటనుండి గంధ మాదన పర్వతములనుండి నా..గు నదు..గా ప్రవహించుచున్నది.

గంధమాదన పర్వతములు



## జంబూద్వీపము

అధిపతి. ఆగ్నీధ్రుడు. జంబు అనగా నేరేడు చెట్టు

రమ్యక హిరణ్మయ కురు

నీల శ్వేత

భద్రాశ్వ గంధమాదన

ఇలావృతము కుముదము కేతుమాల

మందరము

నిషధ హేమకూటము హిమాలయ

హరివంశము కింపురుషవర్షము

భారతవర్షము

| వర్షములు | ఉద్యానవనములు | పర్వతములు |
|---|---|---|
| రమ్యక | నందనము | మేరుపర్వతము |
| హిరణ్మయ | చైత్రరథము | నీల |
| కురు | వైభ్రాజము | శ్వేత |
| భద్రాశ్వ | సర్వభద్రము | నిషధ |
| ఇలావృత | | హేమకూట |
| కేతుమాల | | మాల్యవంతము |
| హరి | | గంధమాదనము |
| కింపురుష | | మందరము |
| భారత | | కుముదము |
| | | హిమాలయములు |

# 1. ప్లక్షద్వీపము

ప్లక్షమనగా జువ్వి లేక రావిచెట్టు. ఆ వృక్షమునుబట్టి ఆ ద్వీపమునకు ఆ పేరు వచ్చింది. సప్తజిహ్మాండను అగ్నిదేవుని ఆ వృక్ష ఛ్చాయలో అచ్చట నున్నవారు పూజింతురు. ఆ అగ్నిస్వయముగ దేవిని ఆరాధించుచూ, ధర్మప్రచారము ఆ ద్వీపవాసులకు చేయుచుండును. ప్రియవ్రతుని కుమారుడు ఇధ్మజిహ్మాండను రాజు ప్లక్షద్వీపమును 7 భాగములుగా చేసి తన ఏడుగురు కుమారులకు పంచియిచ్చెను. ధర్మానుసారముగా రాజ్యమును పరిపాలించమని వారికి బోధించెను.

## ఏడు వర్షముల పేర్లు

2

శివవర్షము, యవసవర్షము, భద్రవర్షము, శాన్తవర్షము, క్షేమవర్షము, అమృతవర్షము, అభయవర్షము.

ప్లక్షద్వీపములో అరుణ, నృమ్ణ, అంగిరస, సావిత్రి, సుప్రభాతిక, ఋతంభర, సత్యంభర అను ఏడు నదులు వున్నవి. మణికూటము, వజ్రకూటము, ఇంద్రసేనము, జ్యోతిష్మంతము, సుపర్ణము, హిరణ్యష్ఠీవము, మేఖమాల అను ఏడు పర్వతములుగూడా వున్నవి.

## 2. ప్లక్షద్వీపము

రాజు - ఇద్మజింహుడు ప్రియవ్రతుని కుమారుడు

ప్లక్షము అనగా జువ్వి లేక రావిచెట్టు.

| | | |
|---|---|---|
| | భద్రవర్షము | శాన్తవర్షము |
| నదులు | | |
| అరుణ | శివవర్షము | యవసవర్షము |
| నృమ్ణ | | |
| అంగిరస | | |
| సావిత్రి | క్షేమవర్షము | అమృతవర్షము |
| సుప్రభాతిక | | |
| ఋతుంభరా | అభయవర్షము | |
| సత్యంభర | | |

| వర్షములు | కులములు | పర్వతములు |
|---|---|---|
| భద్ర | హంసులు | మణికూటము |
| శాన్త | పతంగులు | వజ్రకూటము |
| శివ | ఊర్ధ్వాయనులు | ఇంద్రసేనము |
| యవస | సత్యాంగులు | జ్యోతిష్మంతము |
| క్షేమ | | సువర్ణము |
| అభయ | | హిరణ్యష్ఠీవము |
| అమృత | | మేఘమాల |

సప్తజిహ్వుడను అగ్ని దేవిని పూజించును.

ప్లక్షద్వీపములో చాతుర్వర్ణములు ఈ క్రింది విధముగా నున్నవి. హంసులు, పతంగులు, ఊర్ధ్వాయనులు, సత్సంగులు అను పేర్లతో వుండిరి. అచ్చట ఆయుఃప్రమాణము వేయి సంవత్సరములు. దేవుడు ప్రత్నుడను విష్ణువంశావతారుడు. ప్రజలు అక్కడ సూర్యుని ఆరాధింతురు,

ప్లక్షాది పంచద్వీపములలో అన్నీ సమానములు, ఈ ద్వీపములో క్రమముగా నొకదానికంటే నొకటి ప్రమాణములో ద్విగుణీకృతము.

## శాల్వలీద్వీపము

శాల్వలి అనగా బూరుగుచెట్టు. ఈ ద్వీపములో ఆ చెట్టు వుండుటవలన దానికి ఆ పేరు వచ్చినది. బూరుగువృక్షము గరుడునకు స్థానము. ప్రియవ్రతుని కుమారుడు యజ్ఞబాహు దీనికి అధిపతి. అతడుగూడా తన ద్వీపమును ఏడు భాగములు చేసెను.

శాల్వలీ అనగా బూరుగుచెట్టు.

శాల్వలీ ద్వీపము

| వర్షములు | పర్వతములు | నదులు |
|---|---|---|
| సురోచనం | సరసము | అనుమతి |
| సౌమనశ్యం | శతశృంగము | సినీవాలీ |
| రమణం | వామదేవం | సరస్వతి |
| దేవవర్షకం | కందకము | కుహ |
| పారిభద్రం | కుముదము | రజనీ |
| ఆప్యాయనం | పుష్పవర్షము | నందా |
| విజ్ఞాతం | సహస్రశ్రుతి | రాకా |



| రాజు | కులములు |
|---|---|
| ప్రియవ్రతుని కుమారుడు యజ్ఞబాహు | శ్రుతధరులు |
| | వీర్యధరులు |
| | వసుంధరులు |
| | ఇషుంధరులు |

వారు తమ అన్నమును దేవతలకు, పితృదేవతలకు విభజించి సోముని, ఈశ్వరుని పూజింతురు.

ఆరాజు ఆభాగములను తన కుమారులకు పంచియిచ్చెను. సురోచనము, సౌమనశ్యం, రమణం, దేవవర్షకం, పారిభద్రం, ఆప్యాయనం, విజ్ఞాతం అని ఆ భాగములకు పేర్లు. అక్కడగూడా ఏడు నదులు, ఏడు పర్వతములు వున్నవి. సరసము, శతశృంగము, వాసుదేవము కందకము, కుముదము, పుష్పవర్షము, సహస్రశ్రుతి అనునవి పర్వతములు అక్కడ అనుమతి, సినీవాలీ, సరస్వతి, కుహూ, రజనీ నందా, రాకా అను నదులుగూడా వున్నవి.



అక్కడ చాతుర్వర్ణములు వేరుగా వున్నవి. శ్రుతధరులు, వీర్య ధరులు, వసుంధరులు, ఇషుంధరులని వారిని పిలుతురు. వారందరు తమ అన్నమును దేవతలకు పితృదేవతలకు ఏర్పాటుచేసి అర్పింతురు. సోముని, ఈశ్వరుని పూజింతురు.

## కుశద్వీపము

కుశమనగా దర్భ. అందువలన ఆ పేరుతో కుశద్వీపమని పిలిచిరి. ఆ ద్వీపమునకు ప్రియవ్రతుని కుమారుడు హిరణ్యరేతుడు రాజు. అతడుగూడా తన ద్వీపమును ఏడు భాగములు చేసి తన కుమారులను ఆ భాగములకు రాజులుగా చేసెను.

వసువు, వసుదానము, ధృఢరుచి, నాభిగుప్తము, స్తుత్యవ్రతము, వివక్తము వామదేవకము అను ఆ వర్షములపేర్లు. ఆ ద్వీపములో గూడా ఏడు పర్వతములు వున్నవి. చక్రము, చతుశ్శృంగము, కపిలము, చిత్రకూటము, దేవానీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము అను ఏడు పర్వతములు వున్నవి. రసకుల్య, మధుకుల్య, మిత్రవింద, శ్రుతివింద, దేవగర్భ, ఘృతచ్యుతి, మందమాలిని అను నదులుగూడా కుశద్వీపములో వున్నవి. కుశలులు, కోవిదులు, అభియుక్తులు కులకులు అనునవి అక్కడ వర్ణములు. ఆ ద్వీపములోనివారు అగ్నిని పూజింతురు.

## కుశద్వీపము

కుశమనగా దర్భ.

రాజు - హిరణ్యరేతుడు. ప్రియవ్రతుని కుమారుడు.

| వర్షములు | పర్వతములు | నదులు |
| --- | --- | --- |
| వసువు | చక్రము | రసకుల్య |
| వసుదానము | చతుశ్శృంగము | మధుకుల్య |
| దృఢరుచి | కపిలము | మిత్రవింద |
| నాభిగుప్తము | చిత్రకూటము | శ్రుతవింద |
| స్తుత్యవ్రతము | దేవానీకము | దేవగర్భ |
| వివక్తము | ద్రవిణము | ఘృతచ్యుతి |
| భామదేవకము | | మంత్రమాలిక |

**కులములు**

కుశలలు
కోవిదులు
అభియుక్తులు
కులకులు

ద్వీపములోని ప్రజలు అగ్నిని అర్చింతురు.

# క్రౌంచ ద్వీపము

కుశ ద్వీపమునకు అవతల క్రౌంచ ద్వీపము. ఆ క్రౌంచ ద్వీపము చుట్టూ క్షీర సముద్రము వున్నది. ఆ ద్వీపములో క్రౌంచము అను కొండ వుండుటచే దానికి క్రౌంచ ద్వీపమని పేరు పెట్టిరి. ఆ క్రౌంచ ద్వీపమును పూర్వము కుమారస్వామి ఛేదించినాడు. ఈ ద్వీపము వరుణునిచే సురక్షితముగా వున్నది. అనగా ఇచ్చట వరుణ దేవుని పూజింతురు. ప్రియవ్రతుని కుమారుడు ఘృతప్రుష్టుడు అను నతడు ఈ ద్వీపమునకు రాజు. అచట వున్న నాలుగు వర్ణములు, పురుషులు, ఋషభులు, ద్రవిణులు, దేవకులు అను రకములు.

క్రౌంచ ద్వీపము

రాజు-ఘృతపృష్టుడు. ఇతడు ప్రియవ్రతుని కుమారుడు

కులములు

పురుషులు
ఋషభులు
ద్రవిణులు
దేవకులు

ఈ క్రౌంచ ద్వీపము చుట్టు క్షీర సముద్రము గలదు.
ఈ ద్వీపములో క్రౌంచము అను కొండ వున్నందున
దానికి క్రౌంచద్వీపమని పేరు వచ్చినది.
ఇచ్చట వరుణుని పూజింతురు.

## శాక ద్వీపము

కుశ ద్వీపమునకు అవతల శాక ద్వీపము వున్నది. శాక మనగా టేకు చెట్టు. టేకు వృక్షములు అచ్చట జాస్తిగా వుండును. అందు వలన శాక ద్వీపమని పేరు వచ్చినది మేధాతిధి అను ప్రియ వ్రతుని కుమారుడు ఇచ్చట రాజు. అచ్చట వర్ణములు, సత్యవ్రతులు, క్రతువ్రతులు, దానవ్రతులు అను వ్రతులు అనువారు. అక్కడ వున్న వారు రజోగుణము, తమోగుణము ఎరుగరు, అందరు శుద్ధ సత్వ గుణసంపన్నులు. హరినివారు పూజింతురు.

శాక ద్వీపము

రాజు - మేధాతిధి. ఇతడు ప్రియవ్రతుని కుమారుడు
శాక మనగా టేకు వృక్షము. అక్కడ టేకు చెట్లు జాస్తి.

కులములు

సత్యవ్రతులు
క్రతువ్రతులు
దానవ్రతులు
అనువ్రతులు

వారందరు శుద్ధ సత్వ గుణసంపన్నులు
వారు హరిని అర్చింతురు.

# పుష్కర ద్వీపము

శాక ద్వీపము అవతల పుష్కర ద్వీపము. పుష్కరము అనగా మెట్టు తామర చెట్టు, అది పరమేష్టికి ఆసనము. మానసోత్తర మనుపేరు గలది ఇది ఒక్కటే. ఈ ద్వీపమునకు అధిపతి ప్రియవ్రతుని కుమారుడు వీతిహోత్రుడు. ఇక్కడ బ్రహ్మరూపుని పూజింతురు.

పుష్కర ద్వీపము

శాక ద్వీపము అవతల వున్నది. పుష్కర మనగా మెట్టతామర.

రాజు - వీతి హోత్రుడు. దేవుడు - బ్రహ్మరూపుడు.

లోకములకు అలోకములకు అనగా లోకములు లేని చోటులకు మధ్య లోకాలోక పర్వతములు వున్నవి. సూర్యుని వెలుతురు ప్రవేశించని ప్రాంతమును అలోకమందురు. సూర్యుని ప్రకాశము లోకమందురు. ధృవ మండలాంతము సూర్యుని వెలుతురు పోలేని చోటు. పదార్థము ఆ లోకములో వుండదు. ఆ భూమి సర్వప్రాణి వర్జితము. అక్కడ వున్నది అంతయు సువర్ణమే. అక్కడ ఓషధులు వుండవు. అక్కడ మర్త్యులులేరు. ధృవ పదమున కన్న ఎత్తైనవి లోకాలోక పర్వతములు. అందులో దిగ్గజములు మహేంద్రాది దిక్పాలురువుందురు. భగవంతుడు విష్వక్సేనాది సిద్ధగణములచే, అష్టసిద్ధులచే పరివృతుండై నివశించి వున్నాడు. హరిలోక రక్షనార్థము ఆ అచలమున నివశించుచూ, దేవతలు, సిద్ధపురుషులు పరివేష్టించి యుండవారిచే స్తుతింపబడుచున్నారు.

మొత్తము భూపరిమితి యందు ఆ ప్రదేశము నాలుగవ భాగము వున్నది. ఆ ప్రదేశము ఇరువది ఐదు కోట్లు. ఈ అండమును మృతాండము అందురు.

## ఆగ్నీధ్రుడు

ప్రియవ్రతుని పెద్ద కుమారుడు అతడు ధర్మాత్ముడు. తన ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడెను. ఆతనికి సంతానము కలుగలేదు. అందు వలన అతడు మందరగిరి పర్వతములో ఒక గుహలో బ్రహ్మను గూర్చి తపస్సు చేసెను. బ్రహ్మ ఆతని తపమునకు కరుణించినాడు. బ్రహ్మ ఆతని కోరిక తెలుసుకొన్నవాడు. కాబట్టి దేవ సభలో నృత్యము చేయు పూర్వచిత్తి అను ఒక అందమైన నాట్యకత్తెను, మందర పర్వతములకు ఆతని వద్దకు పంపినాడు. పూర్వచిత్తి అంద చందములకు ఆగ్నీధ్రుడు మెచ్చుకొన్నాడు. ఆమెతో అతడు పొందు కోరినాడు. పూర్వచిత్తి ఆగ్నీధ్రునితో తొమ్మిది సంవత్సరములు కాపురము చేసినది. ఆమెకు తొమ్మిది మంది పుత్రులు కలిగినారు. ఆమె తరువాత దేవేంద్రుని కొలువునకు వెళ్ళి పోయినది. పూర్వచిత్తి అనుగ్రహము వలన పుట్టిన కుమారులు పెద్దవారైనారు. వారు అమితమైన బలశాలులైనవారు.

ఆగ్నీధ్రునకు నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురుడు, భద్రాశ్వుడు, కేతుమాలుడు అని తొమ్మిది మంది పుత్రులు. ఆగ్నీధ్రుడు జంబూ ద్వీపమునకు రాజు

అతడు తన ద్వీపమును తొమ్మిది భాగములుగా చేసి తన కుమారులను రాజులుగా చేసెను. వారు రాజ్యపాలన బాగుగా చేసుకొను చుండిరి. ఆగ్నీధ్రుడు అప్సరసతో భోగములను అనుభవించినాడు. అతడు వేద కర్మలు చేసినాడు. చివరకు సాలగ్రామ్ అను పవిత్ర క్షేత్రమునకుపోయి తరువాత అప్సరస లోకమునకు పోయినాడు.

కింపురుష వర్షము నుండి ఎనిమిది వర్షములలో ఎక్కువ సుఖము ప్రజలకు కలుగును. వారికి ప్రయత్నము చేయకుండానే సుఖములు లభించుచుండెను. అకాల మృత్యువులుగూడా అచ్చట లేవు. అక్కడ ధర్మము, అధర్మము వుత్తమ, మధ్యమ, అధమ బేధములు గూడా లేవు. యుగవర్తనలుగూడా లేవు.

పెద్దవాడైననాభి అజనాభ వర్షమునకు రాజు అయినాడు. ఇది హిమాలయా పర్వతమునకు దక్షిణ భాగమున వున్నది. ఆ అజనాభ వర్షమునే హిమ వర్షమందురు, నాభికి హిమ వర్షము. మిగతావారందరికి వారి వారి పేర్లతో రాజ్యములు వెలసినవి. మిగతా రాజ్యములు కింపురుషవర్షము, హరివర్షము ఇలావృతవర్షము, రమ్యక వర్షము, హిరణ్మయ వర్షము. కురువర్షము, భద్రాశ్వ వర్షము, కేతుమాల వర్షము. ఈ రాజ్యములలోనే ప్రజలకు సుఖములు లభించును. హిమ వర్షములో సుఖములులేవు. హిమవర్షపాలకుడైన నాభికి రుషభుడుఅను కుమారుడు కలిగెను. రుషభునకు నూరుగురు పుత్రులు పుట్టిరి. రుషభునకు పుట్టిన నూరుమంది కుమారులలో పెద్దవాడు భరతుడు.

అతడు చాలా గొప్పవాడు. రుషభుడు చాలా యజ్ఞములు చేసెను. తర్వాత తన పెద్ద కుమారుడగు భరతునకు రాజ్యము అప్పగించి పులహాశ్రమమునకు తపస్సు చేసుకొనుటకు పోయెను.

భరతుడు రాజ్యపాలన చేసి అందరి మన్ననలను పొందెను. అతని కాలము నుండి ఈ దేశమునకు భారత దేశమని ప్రసిద్ధి కలిగినది. భరతుడు కూడా యజ్ఞములు చేసెను. రాజ్య సుఖములు అనుభవించి గొప్ప కీర్తిని పొందెను. భరతుని కుమారుడు సుమతి. చివరకు భరతుడు తన కుమారుడగు సుమతికి రాజ్యమును అప్పచెప్పి సాల గ్రామ క్షేత్రమునకు పోయి తన జీవితమును అచ్చటనే సుఖముగా గడిపి మరు జన్మలో అతడు పవిత్ర కులములో జన్మించెను. అతడే జడభరతుడు.

భరతుని కుమారుడు సుమతి. సుమతి కుమారుడు ఇంద్ర ద్యుమ్నుడు. ఇంద్రద్యుమ్నుని కుమారుడు పరమేష్టి. పరమేష్టి కుమారుడు ప్రతిహార్. ప్రతిహార్ కుమారుడు ప్రతిహర్త. ప్రతిహర్త కుమారుడు భవ. భవ కుమారుడు ఉద్గీథ. ఉద్గీథ కుమారుడు అతి సమర్థ. అతి సమర్థ కుమారుడు ప్రస్తావ్. ప్రస్తావ్ కుమారుడు పృధు. పృధు కుమారుడు నక్త. నక్త కుమారుడు గయ. గయ కుమారుడు నర్. నర్ కుమారుడు విరాట్. విరాట్ కుమారుడు మహావీర్య. మహావీర్య కుమారుడు ధీయా. ధీయా కుమారుడు మహంత్. మహంత్ కుమారుడు మనసన్. మనసన్ కుమారుడు త్వష్ట. త్వష్ట కుమారుడు విరజ్. విరాజ్ కుమారుడు రజ్. రజ్ కుమారుడు శతజిత్.

శతజిత్తుకు నూరుమంది కుమారులు. నూరు మంది కుమారులలో విష్వక్ జ్యోతి ప్రధానుడు. ఈ నూరు మందినుండి ప్రజాభివృద్ధి చెందినది. భారత వర్షమును 9వ భాగములు చేసినారు. ఈ తొమ్మిది విభాగములను 100 మంది రాజులు అనుభవించిరి. వారందరి వంశముల వారు పూర్వకాలములో కృత, త్రేతాది యుగక్రమముగా అనుభవించిరి. ఈ విధముగా భారత్‌కల్పమందు మొదట స్వాయంభువ మనువు వంశము వారు పరిపాలించిరి.




ప్రియవ్రతుడు భార్య బార్హిష్మతి
ఆగ్నీధ్రుడు భార్య పూర్వచిత్తి
ఇధ్మజింహుడు ఇతనికి ఏడుగురు కుమారులు
యజ్ఞబాహు ఏడుగురు కుమారులు
హిరణ్యరేతుడు ఏడుగురు పుత్రులు
ఘృతపృష్ఠుడు
మేధాతిథి
వీతిహోత్రుడు
నాభి
కింపురుషుడు
హరివర్షుడు
ఇలావ్రతుడు
రమ్యకుడు
హిరణ్మయుడు
కురుడు
భద్రాశ్వుడు
కేతుమాలుడు
ఋషభుడు ఇతనికి నూర్గురు కుమారులు పెద్దవాడు భరతుడు
సుమతి
ఇంద్రద్యుమ్నుడు
పరమేష్ఠి
ప్రతిహార్
భవ
భవ
ఉద్గధ
అతిసమర్థ
ప్రస్తావ్
పృధు
నక్త
గయ
గయ
నర్
విరాట్
మహావీర్య
ధీయా
మహత్
మన్‌సన్
త్వష్ట
త్వష్ట
విరజ్
రజ్
శతజిత్
శతజిత్తుకు నూరు మంది కుమారులు వారిలో విష్వక్‌జ్యోతి ప్రధానుడు. భారత వర్షమును 9 విభాగములు చేసెను నూరుమంది పుత్రులు రాజులైరి.

ఆగ్నీధ్రకు పెద్ద కుమారుడు నాభి. అతడు అజనాభ వర్షమునకు రాజు. దానినే హిమవర్షమన్నారు. అది హిమాలయములకు దక్షిణమున వున్నది.

ఆగ్నీధ్ర రెండవ కుమారుడు కింపురుషుడు. ఆతని పేరుతో కింపురుషవర్షము వెలసినది. కింపురుష వర్షము హిమాలయ పర్వతమునకు ఉత్తరమున వున్నది. కింపురుష వర్షములో హనుమంతుడు వుండును. అతడు అచ్చట గంధర్వులతో కలసి శ్రీరాముని ఎల్లప్పుడు ధ్యానించుచుండును.

ఆగ్నీధ్రుని మూడవకుమారుడు పరిపాలించిన దేశమును హరివర్షము. ఆతని పేరుతో ఆ వర్షము వెలసినది. ఇది కింపురుష వర్షమునకు వుత్తరమున వున్నది. నిషధపర్వతమునకు దక్షిణముగా ఈ కింపుర్షవర్షము వున్నది. అందువలన దానికి నైషధ వర్షమనిగూడా పేరు వచ్చినది. ఇచ్చట హరి నరసింహ రూపమున ప్రహ్లాదుని రక్షించినాడు. ఆరాధ్య దేవుడు నరసింహుడే. మేరుపర్వతము ఈ వర్షమునకు మధ్యలోనే వున్నది.

ఆగ్నీధ్రుని నాలుగవ కుమారుడు ఇలావృతుడు. ఇతడు పరిపాలించిన దేశమునకు ఇలావృత వర్షము అయినది. ఇది హరి

వర్షమునకు వుత్తరమున వున్నది. ఇలావృత వర్షములో శివుడు ఆరాధ్య దేవుడు. ఒకసారి శివుడు పార్వతి కేళీ విలాసము జరుపుచున్నారు.

పార్వతి కట్టుబట్టలులేక నగ్నముగా శివుని ఒడిలో నున్నది. ఆ సమయమున మునులు శివుని దర్శించుటకు వచ్చిరి. ఆ దృశ్యమును మునులు చూచిరి. నాటినుండి మునులు శివుని దర్శనమునకు పోవుట మాని హరిదర్శనమునకు పోవుట మొదలుపెట్టిరి. పార్వతి సిగ్గుపడి అవతలికి పోయినది. ఆమె చాలా విచారపడుచుండెను. శివుడు పార్వతిని ఓదార్చెను.

ఆ సమయమున శివుడు పార్వతిని ఓదార్చుటకుగాను నాటి నుండి ఆ వర్షమున ప్రవేశించిన పురుషుడు స్త్రీ ఐపోవుగాక! అని శాపము యిచ్చెను. అందువలన ఆ వర్షములో పురుషులు వుండరు. ఇలావృత వర్షములో వేలాది స్త్రీజనముతో పార్వతి తన భర్తయగు శివుని సేవించుచూ సుఖముగా వుండును. శివుడుగూడా సంకర్షణమూర్తి యగు నారాయణమూర్తిని ధ్యానించుచూ వుండును.

వైవస్వత మనువుకు శ్రద్ధాదేవి అను భార్యగలదు. వైవస్వత మనువునకు చాలాకాలమువరకు సంతానము కలుగలేదు. వారి గురువు

వశిష్ఠులవారు. అతడు వైవస్వతమనువుచేత మిత్రావరుణ యజ్ఞము చేయించినాడు. వైవస్వత మనువు భార్య శ్రద్ధాదేవి తనకు కూతురు కావలెనని కోరుకొన్నది. కాని వైవస్వతమనువు తనకు పుత్రుడు కావలెనని కోరుకున్నాడు. వారికి ఇళయను పుత్రిక పుట్టినది. కాని మనువు సంతోషించలేదు. అందుమీదట వశిష్ఠుడు హరిని ప్రార్థనచేసి తన తపశ్శక్తి చేత ఆ ఇళను సుద్యుమ్నుడు అను రాజ కుమారునిగా మార్చెను. రాజకుమారుడగు సుద్యుమ్నుడు ఒక రోజున తన గుఱ్ఱము మీద ఇళావృత వర్షములోనికి వెళ్లినాడు. శివుడు శాపప్రభావము వలన సుద్యుమ్నుడు స్త్రీగాఐపోయినది. సుద్యుమ్నుడు ఆడదిగా మారి అడవిలో తిరుగ సాగెను. అప్పుడు బుధుడు ఆస్త్రీని చూచి మోహించినాడు. బుధుడు చంద్రుని కుమారుడు.

వారికి పురూరవుడు పుట్టెను. తన కుమారుడు ఆడదిఐనదని వైవస్వతమనువు తెలుసుకొన్నాడు. అతడు విచార పడుచుండెను. అప్పుడు వారి కుల గురువు అయిన వశిష్ఠుడు శివుని గురించి తపస్సు చేసెను. శివుడు ప్రత్యక్ష మయ్యెను. వైవస్వతమనువు కోరికను తీర్చవలసిదని వశిష్ఠుడు శివుని కోరెను. శివుడు కరుణించి సుద్యుమ్నుడు ఒక నెల ఆడది, ఒక నెల మగవాడుగా అగునట్లు వరము యిచ్చెను.

సుద్యుమ్నుడు ఒక నెల ఆడదిగా ఒక నెల మగవాడై రాజుగా పరిపాలన సాగించుచు కాలము గడిపినాడు. చివరకు అతనికి ముగ్గురు పుత్రులు పుట్టినారు. ఉత్కలుడు, గయుడు, విమలుడు అను ముగ్గురు కుమారులు సుద్యుమ్నునకు పుట్టినారు. యీ విధముగా ఇలా వృత వర్షము స్త్రీ జనముతో వుండును.

అగ్నీధ్రుని ఐదవ కుమారుడు రమ్యుడు. అతని పేరుతో అతడు రమ్యక వర్షమును పరిపాలించెను. ఇది మేరు పర్వతమునకు ఉత్తరముగా ఉన్నది. దీనికి నీలాచలమనిగూడా పేరు. నీలాచల పర్వతము అక్కడ వున్నందున దానికి ఆ పేరు వచ్చినది. అచ్చట మత్స్యావతారమున హరిపూజింపబడుచున్నాడు.

ఆరవ కుమారుని పేరు హిరణ్మయుడు. అతడు పరిపాలించిన వర్షము పేరు హిరణ్మయ వర్షము. హరి అచ్చట కుర్మావతారమున పూజింపబడును. ఆగ్నీధ్రుని కుమారుడు ఏడవవాడగు కురువు పరిపాలించిన వర్షమునకు కురు వర్షము అనిపేరు. ఇది శ్వేతపర్వతమునకు వుత్తరమున వున్నది. భగవంతుడు యజ్ఞ వరాహరూపమున పూజింపబడును. ఆగ్నీధ్రుని ఎనిమిదవకుమారుని పేరు భద్రాశ్వుడు. అందువలన ఆ వర్షమునకు భద్రాశ్వ వర్షమనిపేరు వచ్చినది. ఇది మేరు పర్వతమునకు తూర్పునవున్నది. ఇచ్చట హరి హయగ్రీవ అవతారమున పూజింపబడును.

తొమ్మిదవ కుమారుడు కేతుమాలుడు. అందువలన అతడు పరిపాలించిన వర్షమునకు కేతుమాల వర్షమని పేరువచ్చినది. ఈ వర్షము భద్రాశ్వ వర్షమునకు తూర్పున వున్నది. నారాయణుడు కామ ధేవుని రూపమున లక్ష్మీదేవితో గూడా అచట పూజింపబడుచుండును. సంవత్సర ప్రజాపతి తన పుత్రికా పుత్రులతో కలసి అచటనున్న లక్ష్మీ దేవిని నారాయణుని ఆరాధించుచుందురు.



# ప్రమాణ గ్రంథములు

వేదశాస్త్ర పురాణ ఇతిహాసములు హిందూమతమునకు ప్రమాణ గ్రంథములు. హిందూమతమును వేదమతమని గూడా అందురు. ఈ నాలుగు రకముల ప్రమాణ గ్రంథములు మనకు ముఖ్యములు. వేదము అన్నిటిలో హిందూమతమునకు ముఖ్యము. మొదట పుట్టినది వేదమే. ఈ వేదభాష అతిప్రాచీనమైనది. దాని పేరు సంస్కృతము. సంస్కృతము. వుచ్చారణలో కష్టమైనది. అది అందరికి అందుబాటులో లేక పోయినది. దాని ఉచ్చారణ గూడా కాస్త కష్టము. దానిని వేద విద్య అందురు. అది అందరికి అందుబాటులో వుండటానికి మహా రుషులు తర్వాత, శాస్త్రములు అను పేరుతో వేదములు ఆధారముగా వ్రాశిరి.

కాలము గడచిన కొలది ప్రజలకు వాటిని అర్థము చేసుకోలేని కాలమున వేదముల, శాస్త్రముల అర్థములను ప్రతి పాదించుచూ వ్యాసుల వారు పురాణములుగా కథా రూపములతో వ్రాసెను.

ఈ పురాణములలో భగవంతుని సృష్టి, అతని అద్భుతలీలలు, ఆ నాటి దేవతల, రాక్షసుల, మనుష్యుల విషయములు, అనాటి ప్రజల యొక్క సాంఘిక, నైతిక, ఆధ్యాత్మిక విలువలు మరియు వారి జీవిత ములను గురించి వ్రాసిరి. తరువాత ఇతిహాసములు వ్రాయబడినవి.

ఇతిహాసములలో దివ్యపురుషులు ఉదయించిన వారి వంశములు, ఆ వంశములయొక్క పూర్ణచరిత్రలు వ్రాసినారు. శ్రీ మహాభారతము, రామాయణము మొదలగు గ్రంథములను ఇతిహాసములు అందురు. మహాభారతమును వేదవ్యాసులవారు వ్రాసిరి. శ్రీ మద్రామాయణమును వాల్మీకులవారు వ్రాసిరి. రామాయణములో శ్రీరాములవారి చరిత్ర, కుటుంబ సాంఘిక జీవితములకు సంబంధించిన ధర్మములు వివరముగా వ్రాయబడినవి. మహాభారతములో పాండవుల కౌరవుల చరిత్రలు, ధర్మములు, రాజకీయవ్యవహారములు, రాజ్యపాలనా పద్ధతులు ధర్మ సూక్ష్మములు మొదలగునవి అన్నియు విశదముగా తెలుపబడినవి.

శ్రీ మద్భగవద్గీత పారమార్థిక ధర్మము ననుసరించి ప్రబోధముచేసి అనేక బోధలతో గూడిన గ్రంథము. శ్రీకృష్ణుడు అర్జునునకు బోధలద్వారా ప్రకటించి, ప్రపంచమునకు చాటించినారు.

ఈ విధముగా వేదములు, శాస్త్రములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, పురాణములు భగవంతుని చేతను, పూర్వపురుషుల చేతను, మహనీయులచేతను ప్రకటింపబడి భారతదేశములో విఖ్యాతి చెందినవి.

శ్రీభగవద్గీత మహాగొప్ప గ్రంథము. భారతయుద్ధములో శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించెను.

సర్వోపనిషదోగావో దోగ్ధాగోపాలనందనం
పార్థోవత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

ఉపనిషత్తులు అన్నియు గో వు లు. గోపాలనందనుడగు శ్రీకృష్ణపరమాత్మ పాలుపితుకువాడు. అర్జునుడు దూడ. మహత్తర మగు గీతామృతమే పాలు. సద్బుద్ధి గలవారే దానిని త్రాగుదురు. వేదసారమే గీత. గీతాబోధ మానవుని దేవునిగా మార్చివేయగలదు.

ఓంతత్సత్.

మానవులలో మూడు తరగతులవారు వున్నారు.

సోమరులు వీరికి పనిచేయుట గిట్టదు. వ్యర్థప్రసంగములతో కాలము వృథాగా గడుపుదురు.

సకామముగానో, నిష్కామముగానో మంచిపనులో, చెడ్డపనులో చేయుచూ రెండవరకమువారు కాలముగడుపుచుందురు.

కర్తవ్యతా బుద్ధితో, లోకవ్యవహారములు నిర్వహించుచుందురు. వీరుసత్త్వ గుణాభిమానులు.

యజ్ఞమనగా పూజ అని అర్థము. దానికి వుత్పత్తి అర్థము. ఆరాధన, త్యాగమనిగూడా దానికే పేరు.

పూజ-ఆరాధన-బంధవిమోచనమునకు సరళమార్గములు.

——o——